తృతీయ ముద్రణ :
మే 2000
ప్రతులు : 750

మూల్యము : రూ. **6-00**

ప్రాప్తిస్థానము :
**శ్రీ లలితా విద్యామందిరము**
కేదారేశ్వరపేట, విజయవాడ-520 003

ముద్రణ :
తిరుమల ఆర్టు ప్రింటర్స్,
మ్యూజియంరోడ్, గవర్నరుపేట,
విజయవాడ-2.

# నా భావన

భారతీయులకు సేవించ తగిన దేవతామూర్తులు ఎందరో కలరు. ప్రతివారు తమ యిష్టదేవతలను పూజించి పూజా ఫలితములను పొందుచునే యున్నారు.

అయినప్పటికిని అందరు దేవతలకంటె శంకరులే అధిక పూజ్యులని నా భావన. ఇతరదేవతలందరు తమ ప్రభావములను చూపి దుష్టులవలన కలుగు బాధలను తొలగించి సత్పురుషులకు రక్షణ కల్పించారు. ఈ విషయమునే సమస్త దేవతల కథలు చాటుచున్నవి. రాముడు రావణుని చంపెను. కృష్ణుడు కంసుని చంపెను. ఈశ్వరుడు త్రిపురాసురుని చంపెను. దుర్గ మహిషాసురుని చంపెను. దేవతల కథలన్నియు ఇట్టి స్వభావము గలవే.

నామ రూపములు గలవారందరు జీవలక్షణములు గలవారే. అక్కడ అద్వైత భావన యుండదు. అభావన యున్నచో రాముడు రావణుని, కృష్ణుడు కంసుని, ఈశ్వరుడు త్రిపురాసురుని, దుర్గ మహిషాసురుని చంపుట ఎట్లు సిద్ధించును. వీరందరు మనకంటె అధిక శక్తి సంపన్నులగుటచే మనయందరికి పూజ్యులు వరప్రదాతలు అగుచున్నారు. మన యింటియందు అగ్ని యున్నది. సూర్యునియందు ఉన్నది. అయితే రెండింటియందుగల భేదము పరమాణువునకుపర్వతమునకు ఉన్నంత ఉన్నది. అందుచే దేవతలు జీవలక్ష

ణము గలవారయినను మనకు పూజ్యులు అను విషయము మరువరాదు.

శంకరులు ఉన్నతమయిన అద్వైతతత్త్వమును వేదములయందున్న దానిని లోకమునందు ప్రచారముచేసి మన యనుభవములోనికి తెచ్చిన దయామయులు. అందుచే దేవతలకంటె శంకరులే పూజ్యులని నా భావన.

డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన శ్రీమద్భగవత్పాద శంకరాచార్య చరిత్రను సాధన గ్రంథమండలివారు ప్రచురించిరి. దానిని ఆధారముగా చేసుకొని ఇందలి విషయములు సంకలనము చేయబడినవి.

## అభినందనలు

శ్రీమంతులు ధార్మికులు ఉదారులయిన ఈ క్రింది వారు ఈ గ్రంథ ముద్రణకు సహాయము చేసిరి.

శ్రీయుతులు చెరువు తిరుపతిశాస్త్రి, బి. యస్. శాస్త్రి, వై. లోకనాథశర్మ, కోట వీరభద్రరావు, ఎన్. ఎస్. శాస్త్రి, దివ్వెల పిచ్చయ్య, జొన్నవిత్తుల ప్రభాకరశర్మ, పి. రామచంద్రరావు, డి. యల్. నారాయణ, అర్. చంద్రశేఖర్, జి. డి. వి. ప్రసాదరావు మొదలయినవారు, వారందరికి కృతజ్ఞతాభినందనలు తెలియ చేయుచున్నాను.

లలితావిద్యామందిరము
కేదారేశ్వరపేట,
విజయవాడ-3.

ఇట్లు
**వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి**

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ శంకరాచార్య గురవే నమః

# శ్రీ శంకరాచార్యుల చరిత్ర

శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్॥

కేరళ రాష్ట్రమునందు పూర్ణానదీతీరమున కాలటియను గ్రామము కలదు. దాని సమీపముననే వృషాచలము అను పర్వతము గలదు. గ్రామమునకు ఉత్తరమున ఒక మైలు దూరమునందు దుర్గామందిరము, శివాలయమును గలవు. ఆగ్రామమున శివగురువు,ఆర్యాంబ అను బ్రాహ్మణ దంపతులు నివసించుచుండిరి. వీరిది ఆత్రేయస గోత్రము. ఈ దంపతులకు చాలాకాలమువరకు సంతానముకలుగలేదు. శివగురువు సంతానమునుగోరి వృషాచలముమీద నియమ నిష్ఠలతో తపస్సు చేసెను. ఆ తపమునకు మెచ్చిన పరమశివుడు శివగురువునకు స్వప్నమున కనిపించెను. అజ్ఞులు చిరంజీవులగు బహుపుత్రులు కావలయునా, సర్వజ్ఞుడు, అల్పాయువు అగు ఒకకుమారుడు కావలయునా, అని అడిగెను. శివ గురువు సర్వజ్ఞుడయిన అల్పాయువునే కోరెను..

ఆర్యాంబ గర్భము ధరించెను. క్రీ. పూ. 509వ సంవత్సరమున విభవనామ సంవత్సర వైశాఖ శుక్ల పంచమినాడు శంకరులు రవి కుజ శనులు ఉచ్ఛయందుండగ కర్కాటక లగ్నమున జన్మించిరి.

శ్రీ శంకరులు రెండవయేటనే చదువుట వ్రాయుట నేర్చిరి. మూడవయేట కావ్యపఠనము చేసిరి. ఈ వయస్సునందే తండ్రి చూడాకర్మచేసి దివంగతుడయ్యెను.

"బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే" యను శాస్త్రము ననుసరించి శంకరులకు అయిదవ యేటనే ఉపనయనము జరిగెను. వారు గురుకులమున వేద వేదాంగములను చదివి ఏడవయేట యింటికి తిరిగి వచ్చిరి.

## శంకరుల దివ్యచరిత్రము

బాల్యమున శంకరులు దేవినిపూజించి పాలను నివేదన చేసిరి. దేవి పాలను స్వీకరించలేదు. దేవికి తనపై కోపము కలిగినదని శంకరులు విలపించిరి. దేవి ప్రత్యక్షమై బాల శంకరుని తనయొడిలో కూర్చుండ బెట్టుకొని పాలను త్రాగించెను. అందుచేతనే శంకరులు సర్వవిద్యా ప్రసన్నులయిరి.

గురుకులమునందు చదువు సమయమున శంకరులు భిక్ష కొరకు ఒక పతివ్రత యింటికి వెళ్ళిరి. దరిద్రురాలగు ఆమె బ్రహ్మతేజస్సుగల శంకరులకు ఏమియు ఇవ్వజాలనందులకు మిగుల విలపించి ఒక ఉసిరికమాత్రము ఆయన జోలెలో వేసెను. శంకరులు ఆమెపై దయగలవారై లక్ష్మీదేవిని నుతించిరి. ఆమె అనుగ్రహించి బంగారు ఉసిరికలను

కురిపించెను. ఆ సమయమున శంకరులు చేసిన స్తోత్రము నకే కనకధారా స్తవమని పేరు.

తల్లియగు ఆర్యాంబ ప్రతిదినము పూర్ణానదికి స్నాన మునకు వెళ్ళుచుండెను. ఒకదినమున నడువలేక మార్గములో పడిపోయెను, తల్లిపై భక్తిగల శంకరులు తన యోగశక్తిచే ఆ నదిని తన యింటి సమీపమునకు తీసుకొని వచ్చిరి. ఆ సమయముననే శంకరులు ఆచార్యులుగ నుండిరి.

శంకరులవారి లోకోత్తర శక్తిని విని కేరళ ప్రభువు శంకరులను వారి ఆస్థానమునకు ఆహ్వానించిరి. వైరాగ్యము గల శంకరులు రాజసభకు వెళ్ళలేదు. ప్రభువే స్వయముగ శంకరులను దర్శించి తాము వ్రాసిన మూడు నాటకములను వినిపించిరి. శంకరులు అందలి విషయములను వివరణ చేయగా రాజు సంతసించి సహృదయముతో స్వీకరించెను. కాలవశమున ఆ మూడు నాటకములు భస్మము కాగా శంకరులు మరల రాజునకు స్వయముగా వినిపించిరి.

ఒక దినమున శంకరులు పూర్ణానదిలో స్నానము చేయుచుండగ మొసలి పట్టుకొనెను. శంకరులు తల్లితో మొసలి నన్ను చంపుచున్నది. సంన్యాసాశ్రమమునకు అనుజ్ఞ ఇచ్చినచో మొసలి వదలిపెట్టునని చెప్పిరి. ఆమె అంగీక రించగా మొసలి వదలిపెట్టెను.

ఆ యర్థముగల శ్లోక మిటులున్నది.

శ్లో॥ నక్రో౽౦బ మాం తు నయతి తీవ్రతను ర్బలాఢ్యః
సంన్యాసవేషకరణే మమాపి చ జీవితం స్యాత్

సంన్యస్య శ్రవణం కుర్యాత్ అను వచనము ననుస రించి శంకరులు గురువుకొరకు వెదుకసాగిరి.

నర్మదానదీతీరమున ఓంకారనాథక్షేత్రము గలదు. అచ్చట గోవింద భగవత్పాద యతీంద్రులు నివసించు చుండిరి. శంకరులు వారికి నమస్కరించి శిష్యునిగ స్వీక రింప వలసినదని ప్రార్థించిరి. గోవిందపాదులు నీవు ఎవరు అని ప్రశ్నించిరి. శంకరులు తమ యద్వైత స్వరూపమును శ్లోకములలో వినిపించిరి. ఆ సమయముననే నిర్వాణషట్కం, నిర్వాణ దశకం, నిర్వాణమంజరి, నిర్గుణమానసపూజ, మొద లగువానిని రచించిరి. శంకరుల వాక్యములకు సంతసించి గోవింద భగవత్పాదులు ప్రణవ సహితముగా దీక్ష నిచ్చిరి. శంకరులు అచ్చట రెండు సంవత్సరము లుండిరి.

ఆ సమయమున ఏకధారగా అయిదు రోజులు వర్షము కురిసెను. నర్మదానదినీరు ఆశ్రమములోనికివచ్చెను. శంకరులు తన కమండలముతో ఆ నీటిని అరికట్టిరి. ఒక మట్టి పాత్రలో నీరంతయు నింపగలవారే తన బ్రహ్మ సూత్రములకు భాష్యము వ్రాయుటకు సమర్థులని వ్యాస

మహర్షి గురు గోవిందపాదులకు చెప్పియుండెను. ఆ విష యము గురువులు చెప్పగ శంకరులు గురువుల యనుమతి ననుసరించి వ్యాసమహర్షిని దర్శించుటకు కాశీక్షేత్రమునకు బయలుదేరిరి. ఆ సమయమున శంకరులు గురుస్తుతిని చక్కగ శ్లోకములలో చేసిరి.

సర్వాణి పుణ్యతీర్థాని సేవ్యాన్యేవ ముముక్షుభిః, అనియు, తీర్థీకుర్వంతి తీర్థాని, అను నారదవచనము అనుస రించియు, స్వయం హి తీర్థాని పునంతి సంతః అను భాగవత వచనము నరుసరించియు పుణ్య క్షేత్రములు ముక్తి ప్రద ములు. ప్రత్యేకముగా కాశీక్షేత్రమునకు ముక్తిక్షేత్రమనియు శివపురియనియు, త్రిపురారి రాజనగరి అనియు పేరులు గలవు.

అట్టి క్షేత్రమునకు శంకరులు వ్యాసమహర్షి దర్శనము కోరి వెళ్ళిరి. అచ్చట అన్నపూర్ణావిశ్వేశ్వరుల దర్శనముచేసి వారిని స్తుతించిరి. ఒకరోజున గంగాస్నానముచేసి వచ్చు చున్న శంకరులకు పరమశివుడు ఛండాల వేషధారియై ఎదు రుగావచ్చెను. శంకరులు అతనిని దూరముగా తొలగుమనిరి అంతట ఛండాలవేషమున నున్న పరమశివుడు ఎవరిని తొలగమందువు? అన్నమయము శరీరమునుండి శరీరమునా? చైతన్యమునుండి చైతన్యమునా? గంగాజలము నందు, ఛండాల వాటికయందలి గంగాజలాశయమునందు ప్రతి

బింబించు సూర్యునికి భేదముండునా? ఆత్మయందు ఇతడు ఛండాలుడు ఇతడు విప్రుడు అను భ్రమ నీకెట్లు కలిగినది. అని ప్రశ్నించెను. ఆ ఛండాలుడే విశ్వనాధుడని గ్రహించి శంకరులు మనీషాపంచకము చెప్పిరి.

ఆ విధముగ కాశీలో నివసించు సమయమున శంకరులు ఎన్నియో దేవతాస్తోత్రములు ఆత్మబోధనలు అగు రచనలు చేసిరి.

శ్రీ శంకరులు కాశీనగరమునుండి శిష్యులతోబయలు దేరి హరిద్వార హృషీకేశములమీదగ బదరీక్షేత్రముచేరిరి. అచ్చటనే భాష్యములను రచించిరి. బదరీనుండి తిరిగి వచ్చి కాశీనగరములో నివసించు సమయమున ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి బ్రహ్మసూత్రములయందలి తదనంతర ప్రతిపత్తా అనుసూత్రమును వివరించవలసినదనికోరిరి. ఆ సమయమున వారిద్దరకు ఎనిమిదిరోజులు వాదము జరిగెను. పద్మపాదులు ఆ బ్రాహ్మణుని వ్యాసునిగ గుర్తించిరి. శంకరులు వ్యాసుని స్తుతించిరి. వ్యాసులు సంతసించి యిటుల ఆశీర్వదించిరి.

అష్టావయాంసి విధినా తవ వత్స దత్తా
న్యన్యాని చాష్ట భవతా సుధి యార్జితాని
భూయోఽపి షోడశ భవంతు భవాజ్ఞయా తే
భూయాశ్చ భాష్య మిద మా రవి చంద్ర తారకమ్॥

అనగా శంకరుల ఆయువు ఎనిమిది సంవత్సరములు. వారు తపస్సుచే మరియొక ఎనిమిది సంవత్సరములు సంపాదించిరి. వ్యాసులు మరియొక పదియారు సంవత్సరములు అనుగ్రహించిరి. భాష్యము సూర్యచంద్రు లున్నంతవరకు నిలుచునని చెప్పిరి.

శంకరులు కుమారిలభట్టుతో వాదన చేయుటకు ప్రయాగ నగరమునకు వచ్చిరి. కుమారిలభట్టు వైదికమత మును కర్మకాండను గట్టి పునాదులపై నిలబెట్టెను. ఆయన ప్రచ్ఛన్న వేషములతో భౌద్ధుల నాశ్రయించి వారి విద్యల యందలి రహస్యములను తెలుసుకొని వారిని ఓడించెను. గురువులను తిరస్కరించిన దోషము పోవుటకు తన దేహ మును అగ్నియందు ఆహుతి చేసుకొనుచుండెను. శంకరులు వారిని చూచి దగ్ధదేహమునకు స్వస్థత చేకూర్చగలనని చెప్పిరి. అందులకు కుమారిలభట్టు అంగీకరించక మండన మిశ్రునితో వాదన చేయవలసినదని చెప్పిరి.

శంకరులు మాహిష్మతీ నగరమునకు వెళ్ళి మండన మిశ్రుల గృహమును గురించి విచారించగా నగరవాసులు ఇటుల చెప్పిరి. మండన మిశ్రుని గృహప్రాంగణమున చిలుకలు 'స్వతః ప్రమాణం పరతః ప్రమాణమ్' అని వాదనచేయుచుండును. శంకరులు వెళ్ళిన సమయమున మండనమిశ్రులు శ్రాద్ధము పెట్టుచుండిరి. వ్యాస, జైనమహర్షులు భోక్తలుగా

నుండిరి. తలుపులు మూసియుండుటచే శంకరులు ఇంటి కప్పులోనుండి లోనికివెళ్ళిరి. శంకరుల రాకనుచూచి మండనుడు కోపగించుకొనెను. భోక్తలు శ్రాద్ధమును శాంతముతో పెట్టవలయుననియు యతిని సత్కరించి భిక్ష పెట్టమనియు చెప్పిరి. మండన మిశ్రుడు భిక్ష స్వీకరించవలెనని కోరగా శంకరులు వాదభిక్ష నడిగిరి. మండన మిశ్రుడు అంగీకరించెను. మండనమిశ్రుని భార్య ఉభయభారతి మధ్యవర్తిగా ఉండెను. ఆమె వారిద్దరికంఠములను పూలదండలతో నలంకరించి ఓడినవారి దండ వాడిపోవునని చెప్పెను. ఓడినవారు గెలిచినవారి మతమును స్వీకరించ వలయునని పణముగా పెట్టుకొన్నిరి. అనేక దినములు వాదన జరుగగా మండన మిశ్రుని మెడలోని దండ వాడిపోయెను. మండనుడు సంన్యాసము స్వీకరించవలసిన వాడయ్యెను. ఉభయభారతి విషయము గ్రహించి ఇద్దరిని భిక్ష చేయవలసినదని పిలిచెను. అంతకు పూర్వము మండన మిశ్రుని వైశ్వదేవమునకు శంకరులను భిక్షకు పిలుచు చుండెను.

ఉభయభారతి తననుకూడ ఓడించిననేకాని తన భర్తను ఓడించినటుల కాదనియు కామశాస్త్రములో తనతో వాదించమనియు శంకరులను కోరినది. శంకరులు తనకు కామశాస్త్రములో పరిచయము లేదనియు నెలరోజులు గడువు కావలసినదనియు కోరిరి. ఉభయభారతి అంగీకరించెను.

ఆ సమయమున ఆ దేశమునేలు రాజు మరణించెను. ఆయన శవమును దహనము చేయుటకు శ్మశానమునకు తీసుకొని వెళ్ళిరి. శంకరులు ఆ విషయమును గ్రహించి తన శరీరమును ఒక గుహయందు భద్రపరచుకొని రాజుశరీరము నందు ప్రవేశించిరి తన శరీరమునకు ప్రమాదము సంభ వించినపుడు తనను ప్రార్థించవలసినదని శిష్యులతో జెప్పిరి.

రాజు శవమునందు ప్రాణము వచ్చుటచే రాజు మరల బ్రతికెనని అందరు తలచిరి. రాజుభార్య మాత్రము ఎవరో మహాయోగి తన భర్తశరీరములో ప్రవేశించెను. అని తెలుసు కొనెను. దహనము చేయని శరీరములు ఎచ్చటనైనను ఉన్నచో దహనము చేయవలసినదని సేవకుల కాజ్ఞాపిం చెను. సేవకులు శవము కొరకు వెదుక నారంభించిరి. ఈ లోపల శంకరులు అంతఃపుర స్త్రీలతో కలసి కామశాస్త్ర రహస్యములు తెలుసుకొనెను. సేవకులు శంకరుల శరీర మును కనుగొని దహనము చేయనారంభించిరి. శిష్యులు శంకరులను ప్రార్థించగ వారువచ్చి మరల తన శరీరములో ప్రవేశించిరి. అప్పటికే శరీరము సగము కాలి యుండెను. శంకరులు కరావలంబన క్షేత్రముచేయగా నృసింహస్వామి దయవలన స్వస్థత చేకూరెను.

ఉభయభారతి వాదమున ఓడిపోయెను. ఆమె బ్రహ్మ దేవుని పత్నియగు శారదాదేవి. ఒక సమయమున ఆమె

దూర్వాసుని చూచి నవ్వెను. అందులకు ఆయన కోపించి మర్త్యలోకమున పుట్టవలసినదనిశపించి శంకరులవలన శాప విమోచన కలుగునని చెప్పిరి. శాప విమోచనము అయిన వెంటనే ఆమె నిజరూపముతో బ్రహ్మలోకమునకు బయలు దేరెను. శంకరులు ఆమెను వనదుర్గామంత్రముతో బంధించి లోకోపకారమునకై భూలోకమున ఉండవలసినదని ప్రార్థించిరి. అందులకు ఆమె అంగీకరించి మీరు ముందు నడచు చుండగ నేను వెనుకవత్తును. మీరు వెనుకకు మరలి చూచి నచో అచ్చటనే నిలచి పోదునని చెప్పెను. అందులకు శంకరులు అంగీకరించి ముందు నడచుచుండిరి. శారదాదేవి అదృశ్యరూపమున ఆయన వెనుక నడచుచుండెను. ఆమె నూపుర ధ్వనులు వినుచు శంకరులు ముందు నడచుచుండిరి. శృంగేరీ ప్రాంతమున ఆమె నూపురధ్వని వినిపించలేదు. శంకరులు వెనుకకు తిరిగిచూచిరి. శారదాదేవి అచటనే నిలిచిపోయెను.

ఆర్యాంబకు తుదిఘడియలు సమీపించెను. శంకరులు తల్లి సమీపమునకు చేరి వేదాంత తత్త్వమును బోధించిరి. శివవిష్ణు స్తుతులు చేసిరి. ఆమె మరణించగా అంత్యక్రియలు స్వయముగా చేసిరి. అటుపిమ్మట దక్షిణదేశము నందలి అన్ని క్షేత్రములు దర్శించి దేవతాస్తుతులు చేసిరి.

శ్రీ శంకరులు దేశాటన చేయుచు శ్రీశైలము చేరిరి. ఒక కాపాలికుడు శంకరునివద్దచేరి వేదాంతపఠనముచేసెను.

అతడు ఒక దినమున నేను చేయుచున్న భైరవారాధన సఫలము అగుటకు యతీశ్వరుని శిరమును హోమము చేయవలసి యున్నది. మీ శిరమును ఇవ్వవలసినదని శంకరులను ప్రార్థించెను. శంకరులు వారి శిష్యులు దగ్గరలేని సమయమున నా శిరమును తీసుకొనవలసినదని చెప్పిరి. కాపాలికుడు తగిన సమయముకోసము చూచి తీసుకొనబోవుచుండెను ఇంతలోపద్మపాదులు నృసింహస్వామి పూనికతో అచటికి వచ్చి కాపాలికుని గోళ్ళతో చీల్చి చంపెను. ఆ సమయమున శంకరులు పద్మపాదుని ఆవహించిన నృసింహస్వామిని స్తుతించి శాంతింప చేసిరి.

శంకరులు శ్రీబలి యను గ్రామము చేరిరి. అచ్చట ప్రభాకరుడను బ్రాహ్మణుని కుమారుడు పిచ్చివానివలె సంచరించుచుండెను. ప్రభాకరుడు ఆ కుమారుని శంకరులకు చూపిరి శంకరులు నీవు ఎవరని ప్రశ్నించగా బాలుడు అద్వైతభావమును ప్రకటించెను. వెంటనే శంకరులు ఈ బాలుడు నా దగ్గర ఉండవలసినవాడని తండ్రితో చెప్పి తన వెంట తీసుకొని వెళ్ళిరి. అతనికి హస్తామలకుడని పేరు పెట్టిరి. ఇతని మొదటిపేరు పృథ్వీధరాచార్యుడు.

శంకరులు శాశ్వతముగ ధర్మమును రక్షించుటకై నాలుగు దిక్కుల యందును నాలుగు పీఠములను స్థాపించిరి. వాటి వివరములు ఈ విధముగ ఉన్నవి.

పూర్వామ్నాయము - వేదము ఋగ్వేదము, మహా వాక్యము ప్రజ్ఞానం బ్రహ్మ-గోత్రము కాశ్యప, క్షేత్రము పురుషోత్తమదేవుడు జగన్నాథుడు. మఠనామము గోవర్ధన, ఆచార్యుడు హస్తామలకుడు. కేంద్రము పూరీ జగన్నాథము హస్తామలకుని చరిత్ర పూర్వము వ్రాయబడినది.

దక్షిణామామ్నాయము — వేదము యజుర్వేదము, మహావాక్యము అహం బ్రహ్మాస్మి, గోత్రము భూర్భువః, తీర్థము తుంగభద్ర, క్షేత్రము రామక్షేత్రము. దేవుడు వరాహస్వామి, దేవత శారదా, మఠనామము శృంగేరి శారద. ఆచార్యుడు సురేశ్వరుడు, కేంద్రము శృంగేరి, మండనమిశ్రుడే సురేశ్వరాచార్యులుగ ప్రసిద్ధి చెందిరి.

పశ్చిమామ్నాయము-వేదము సామవేదము మహా వాక్యము. తత్త్వమసి, గోత్రము అనిగత. తీర్థము గోమతీ నది. క్షేత్రము ద్వారకానగరము. దేవుడు సిద్ధేశ్వరుడు. దేవత భద్రకాళి. మఠనామము ద్వారకామఠము. ఆచార్యుడు. పద్మపాదులు. కేంద్రము ద్వారక.

గంగానది ప్రవహించు సమయమున శంకరులు పద్మ పాదుని నదిపై నడచి రమ్మనిరి. ఆయన నడుచు సమయమున పాదముల క్రిందపద్మములు ఏర్పడుటచే పద్మపాదులు అని పేరు పొందిరి.

ఉత్తరామ్నాయము - వేదము, అథర్వవేదము, మహావాక్యము అయమాత్మా బ్రహ్మ, గోత్రము, భృగు, తీర్థము-అలకానంద. క్షేత్రము బదరికాశ్రమము. దేవుడు నారాయణుడు. దేవత పూర్ణగిరి. మఠనామము జ్యోతిర్మఠము ఆచార్యుడు త్రోటకుడు, కేంద్రము-బదరికావనము.

త్రోటకాచార్యులవారి మొదటి నామము గిరి. వీరు శంకరులను తోటక వృత్తములచే స్తుతించిరి. అందువలన త్రోటకాచార్యులు అను సార్థకనామమును పొందిరి.

  

## శంకరుల అద్వైత సిద్ధాంతము

ఆచార్యులవారు స్థాపించిన మతమునకు అద్వైతముఅని పేరు. ఈ మతము వేదశాస్త్రసమ్మతమయి అనుభవవేద్యమై యున్నది. ఈ సృష్టియంతయు బ్రహ్మపదార్థముచే వ్యాప్తమై యున్నది. అయినను సామాన్యులకు వేరువేరుగ కన్పించుటకు కారణము వారియందుగల అజ్ఞానమే. బంగారముతో చేసిన ఆభరణములకు వేరువేరు నామరూపములున్నప్పటికిని వానియందుగల బంగారము మాత్రము ఒక్కటె. అటులనే ఈ సృష్టియంతయు బ్రహ్మవికారమేగాని వేరుకాదు. బీజమునందు చెట్టునకుగల కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు, దాగియున్నటుల సృష్టికి పూర్వము ఈ పదార్థములన్నియు బ్రహ్మయందు దాగియున్నవి. సత్కర్మాచరణముచే చిత్త

శుద్ధిని సంపాదించి వేదాంతశాస్త్ర శ్రవణమననాదులచే అజ్ఞానము తొలగినపుడు అంతయు బ్రహ్మమయముగా కన్పించును. ఈ ప్రపంచమంతయు స్వప్నతుల్యము. స్వప్నము పోయినతరువాత స్వప్నమునందలి పదార్థములు కనిపించని విధమున అజ్ఞానము తొలగిన తరువాత భేదభావము నశించి అంతయు ఆత్మపదార్థముగా కనిపించును.

  

# ఉపదేశ పంచకమ్

వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యేమతి స్త్యజ్యతామ్
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతాం
ఆత్మేచ్ఛావ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్ ॥

నిత్యము వేదము చదువుము. వేదము చెప్పిన కర్మలను చేయుము. ఈశ్వరుని పూజింపుము. కోరికలను విడిచిపెట్టుము. పాపములను పరిహరించుము. సంసారము నందలి దోషము తెలిసికొనుము ఆత్మజ్ఞానమునకు ప్రయత్నించుము ఇంటిని విడిచి బయటకు వెళ్ళుము.

సంగస్సత్సువిధీయతాం భగవతో భక్తిర్దృఢాఽఽధీయతాం
శాంత్యాదిః పరిధీయతాం దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్
సద్విద్వానుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకే సేవ్యతామ్
బ్రహ్మైకాక్షరమర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్॥

సత్పురుషుల స్నేహము చేయుము. భగవంతుని యందు దృఢమయిన భక్తిని నిలుపుము. శాంతిని సాధింపుము. దుష్టకర్మలను విడిచిపెట్టుము. పండితుల దగ్గరకు వెళ్ళుము. వారి పాదములను సేవించుము. ఏకాక్షరమయిన ప్రణవమును యాచింపుము. వేదాంత శ్రవణము చేయుము.

వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరః పక్షస్సమాశ్రీయతాం
దుస్తర్కాత్సు విరమ్యతాం శ్రుతిమతస్తర్కోఽనుసంధీయతాం
బ్రహ్మైవాస్మి విభావ్యతామహరహః గర్వః పరిత్యజ్యతామ్
దేహేఽహమ్మతి రుఝ్ఝ్యతాం బుధజనైర్వాదఃపరిత్యజ్యతామ్

వేదాంత వాక్యవిచారము చేయుము. వేదాంత పక్షమును ఆశ్రయించుము. దుష్టమయిన తర్కమును విడిచి వేదవిహిత మయిన తర్కమును చేయుము. రాత్రిం బవళ్ళు బ్రహ్మను అని భావన చేయుము. గర్వము విడిచిపెట్టుము. శరీరమునందు ఆత్మబుద్ధిని విడిచిపెట్టుము. పండితులతో వాదన చేయకుము.

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం నతు యాచ్యతాం విధివశాత్ప్రాప్తేన
సంతుష్యతామ్
శీతోష్ణాది విషహ్యతాం న తు వృథావాక్యం సముచ్చార్యతాం
ఔదాసీన్య మభీప్స్యతాం జనకృపానైష్ఠుర్యముత్సృజ్యతామ్॥

ఆకలియను రోగము పోవుటకు భిక్షయను మందును తినుము. రుచికరములయిన అన్నమునకు ఆశపడకుము. దైవవశమున లభించినచో సంతసింపుము. వేడిని చలిని సహించుము. వ్యర్థముగా మాటలాడకుము. ఉదాసీనుడవయి యుండుము. జనుల దయకు ఆశపడకుము.

ఏకాంతే సుఖమాస్యతాం పరతరే చేతస్సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతాం
ప్రాక్కర్మప్రవిలాప్యతాం చితిబలా న్నాప్యుత్తరైః శ్లిష్యతాం
ప్రారబ్ధ స్త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనాస్థీయతామ్ ॥

ఏకాంతమునందు సుఖముగా నుండుము. బ్రహ్మయందు చిత్తమునిలుపుము. ఈ జగత్తును ఆత్మస్వరూపముగా భావించుము. జగత్తు నశించునది అని తెలియుము. పూర్వకర్మను జ్ఞానబలమువలన నాశనముచేసుకొనుము. ఆగామి కర్మలయందు కోరికను విడిచిపెట్టుము. ప్రారబ్ధము అనుభవించుము, పరబ్రహ్మయందు స్థిరముగా నుండుము.

శ్లో॥ యః శ్లోక పంచకమిదం పఠతే మనుష్యః
సంచింత యత్యనుదినం స్థిర తాముపేత్య
తస్యాశు సంసృతి దవానల తీవ్ర ఘోర
తాపః ప్రశాంతి ముపయాతి చితి ప్రసాదాత్ ॥

ఈ అయిదు శ్లోకములను ప్రతిదినము స్థిరమయిన సమబుద్ధితో చదివి ఆలోచించినవారికి ఆత్మ సాక్షాత్కారము వలన సంసారమనెడు దావాగ్ని నశించి శాంతి లభించును.

* * *

# శ్రీ శంకరాచార్య చరితమ్

శ్రీ శంకరాచార్యః కేరళరాష్ట్రే కాలటిగ్రామే సంజాతః అస్య పితా శివగురుః మాతా ఆర్యాంబా తయోః దంపత్యోః బహు కాలానంతరం పరమేశ్వర ప్రసాదేన అల్పాయుః

సర్వజ్ఞః శంకరః సంజాతః, అస్యతృతీయే వర్షే పితా దివంగతః. శంకరస్య పంచమే వయసి ఉపనయనమభూత్. వర్షద్వయ పర్యంతం గురుకులే ఆసీత్. ఏకాం పతివ్రతాం దారిద్ర్యపీడితాం రక్షితుం కనకధారాస్తవ మకరోత్. మాతుః సౌకర్యార్థం పూర్ణానదీం గృహ సమీపమానయత్. మకరబాధితః మాతుః అనుజ్ఞాంప్రాప్య ఆశ్రమస్వీకరణాయ గురుగోవింద పాదస్య సమీప మగచ్ఛత్. ఆశ్రమస్వీకారం యథావిధి ప్రాప. నర్మదానదీ ప్రవాహం కమండలునా నివారయామాస. గురోః ఉపదేశేన వ్యాసదర్శనం కర్తుం కాశీమగచ్ఛత్. వ్యాసదర్శనం కృత్వా తస్య అనుగ్రహేణ ద్వాత్రింశత్ ఆయుః ప్రాప. బదరీక్షేత్రం గత్వా భాష్య రచనా మకరోత్. ప్రయాగక్షేత్రే కుమారిలభట్టు పండితం జేతు మగచ్ఛత్. కింతు సః అగ్ని బాధితః ఆసీత్. తస్య వచనానుసారేణ మాహిష్మతీనగర మగచ్ఛత్. తత్ర మండన మిశ్ర పండితం తస్యజాయా ముభయభారతీం చ అజయత్ మాతుః అవసానదశాం జ్ఞాత్వా కాలటిగ్రామ మగచ్ఛత్. మాతుః అంత్యక్రియాం స్వయమకరోత్ శంకరః దేశాటనం కుర్వన్ శ్రీశైల క్షేత్ర మాగతః. తత్ర ఏకః కాపాలికః శంకరం వంచయితుం ప్రయత్న మకరోత్. నృసింహ సేవకః పద్మపాదః తత్ జ్ఞాత్వా తం కాపాలికం మమార.

ఏవం శంకరః సర్వస్మిన్ దేశే అద్వైతమత స్థాపనం కృత్వా ధర్మరక్షణార్థం చతుర్షు దిక్షు శంకర పీఠాన్ ఆస్థాప యత్. తస్య అనుగ్రహేణ వయం సర్వే కృతార్థాః సంజాతాః.

# లింగాష్టకం

బ్రహ్మమురారి సురార్చితలింగం నిర్మలభాసిత శోభితలింగం
జన్మజ దుఃఖవినాశక లింగం తత్ప్రణమామి సదాశివలింగం
దేవముని ప్రవరార్చితలింగం కామదహాన కరుణాకర లింగం
రావణదర్పవినాశక లింగం తత్ప్రణమామి సదాశివలింగం ॥
సర్వసుగంధ సులేపితలింగం బుద్ధివివర్ధన కారణలింగం
సిద్ధసురాసుర వందితలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥
కనక మహామణిభూషితలింగం ఫణిపతి వేష్టిత శోభితలింగం
దక్షసుయజ్ఞ వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం ॥
కుంకుమ చందన లేపితలింగం పంకజహార సుశోభితలింగం
సంచితపాపవినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం ॥
దేవగణార్చిత సేవితలింగం భావైర్భక్తిభి రేవచలింగం
దినకరకోటి ప్రభాకరలింగం తత్ప్రణమామి సదాశివలింగం॥
అష్టదళోపరివేష్టిత లింగం సర్వసముద్భవ కారణ లింగం
అష్టదరిద్ర వినాశన లింగం తత్ప్రణమామి సదాశివలింగం ॥
సురగురు సురవర పూజిత లింగం
సురవన పుష్ప సదార్చితలింగం
పరమపదం పరమాత్మక లింగం
తత్ప్రణమామి సదాశివలింగం ॥
లింగాష్టకమిదం పుణ్యం యః పఠేచ్ఛివ సన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే ॥

ఇతి లింగాష్టకమ్